ఓమ్

శ్రీరామబ్రహ్మ గ్రంథమాలా

ప్రథమ కుసుమము





# బ్రహ్మేంద్ర సేవా దర్పణము

ప్రతి మఠ మందిర ఆశ్రమము లందుండ వలసిన గ్రంథము

ఇందు బ్రహ్మము గారి నామ సంకీర్తనము,

భజన, ప్రభాత సేవ, పూజ, సహస్రనామ పూజ, ఏకాంత సేవలు,

శ్రీ రామబ్రహ్మ గేయములు గలవు



గ్రంథకర్త :

ఇంకొల్లు శ్రీరామశర్మ (శ్రీరామ బ్రహ్మము)

శ్రీరామ బ్రహ్మాశ్రమము, పెదకొత్తపల్లి - వంగవోలు

ద్వితీయ ముద్రణము ప్రతులు 1000



2002

వెల : అమూల్యము

# జ్ఞాపకార్థము



కవి పౌత్రుడు

## I.S.R. శర్మ, A.M.C.N.

## గమనిక

భక్తులారా!

నాన్న ప్రకటించినట్టి గ్రంథములు నిండు
కొన్నవి; వలయు భక్తుల కోర్కె మీద
పూర్తిచేయనుంటి ద్వితీయ ముద్రణమ్ము
ముందు పారాయణ చరిత్ర పూర్తియయ్యె

తలఁచినట్టి కార్యములు విఘ్నమగుచున్న
సమయమందు స్వామి చరిత పఠన
మండలమ్ము చేయ మహిమాన్వితమ్ముగ
సంకటములు దొలఁగి స్వస్తికలుగు

ఇట్లు
కవి కుమారుడు
**రామబ్రహ్మం**

**పెదకొత్తపల్లి**

**21-09-2002**

ఓమ్

శ్రీరామబ్రహ్మ గ్రంథమాలా

ప్రధమ కుసుమము

# శ్రీ
# బ్రహ్మేంద్ర సేవా దర్పణము

ప్రతి మఠ మందిర ఆశ్రమము లందుండ వలసిన గ్రంథము

ఇందు బ్రహ్మము గారి నామ సంకీర్తనము,

భజన, ప్రభాత సేవ, పూజ, సహస్రనామ పూజ, ఏకాంత సేవలు,

శ్రీ రామబ్రహ్మ గేయములు గలవు



గ్రంథకర్త :

ఇంకొల్లు శ్రీరామశర్మ (శ్రీరామ బ్రహ్మము)

శ్రీరామ బ్రహ్మాశ్రమము, పెదకొత్తపల్లి - వంగవోలు

ద్వితీయ ముద్రణము ప్రతులు 1000



2002

వెల : అమూల్యము

# కృతి సమర్పణము

నాచే భక్తి ప్రచారార్థము 1931లో శ్రీరామబ్రహ్మాశ్రమమును నెలకొల్పించి సేవాదర్పణము జేయించి 1932లో బ్రథమ దర్శనమిచ్చి నవీనముగా వ్రాసిన "కోటి"ని గ్రహించి, 1933లో యువజన మహాసభా యుక్తముగా తృతీయ వార్షికోత్సవము నెగ్గించి 1935లో గురూప దేశమిప్పించి 1937లో "శ్రీరామా! నిను రంగనిదాపుకు రమ్మంటిని" అను కాలజ్ఞాన వాక్యమున కర్థము సూచించి, లక్షనామ పూజ నిర్వర్తించి 1939లో శతాహ్నిక సంకీర్తన మహాయజ్ఞమును గట్టునకెక్కించి 1941లో గోవిందాంబికా సిద్ధాంజనేయ జగదీశ్వరీ సహితముగ దమశిలా విగ్రహ ప్రతిష్ఠను బూర్తి నొందించి, ఆ సంవత్సరమే కంది మల్లయ్య పల్లెలో సన్నిధానమున నామైకాహ మొనర్పించి అందే, ముఖ మంటపమున నాదొక యంకణము జేర్పించి, అచటనే శాశ్వత పూజల జరిగించు భాగ్యము బ్రసాదించి 1943లో 108 కళ్యాణములను శ్రీ విశ్వకర్మ మహాయాగమున నెరవేర్పించి, 1944లో గేయచరిత్రము జెప్పించి, 1945లో గ్రహణి వ్యాధి సందర్భమున నా సన్న మృత్యువును దప్పించి 1946లో హరికథను, 1947లో బుఱ్ఱకథను, 1948లో నాటకమును ముగింపించి 'కవి వతంస' బిరుదమును గ్రహించి ప్రస్తుతము సర్వస్వ గ్రంథమును వ్రాయుంచుచున్న జగద్గురు శ్రీ విరాట్ పోతులూరి వీర బ్రహ్మేంద్ర భగవానుల వారికి భక్తితో నీ గ్రంథమును సమర్పించు కొనుచున్నాను.

ఇట్లు

1953

గ్రంథ కర్త.

# కర్తృ విజ్ఞాపనము

1931లో నే నాశ్రమ స్థాపన మొనర్చి భజనాదికముల జేయ తల పెట్ట నట్టి కీర్తనలు లేకుండెను, అందుచే సంకీర్తన, భజన, ప్రభాత సేవ, పూజ, ఏకాంత సేవ అను నైదు భాగములు గల శ్రీ బ్రహ్మేంద్ర సేవాదర్పణము అను నీ గ్రంథము రచించి తద్భాగముల జరుపుచుండిని.

ఇట్టి సమయములో శతాహ్నిక సంకీర్తన మహాయజ్ఞము నూతనాశ్రమ నిర్మాణము జాయా శిష్య జగదీశ్వరీ సహిత శ్రీ బ్రహ్మేంద్ర స్వాముల వారి ప్రతిష్ఠలోనగు కార్యములు గావింపవలసి వచ్చెను. కాన వానితో జాల రోజులు పట్టెను. ఇంతలో కాగితములులోనగు వాని ధరలు పెరిగెను. ఇట్టి సంకటముతో నా గ్రంధ ప్రకటనము నిలిచిపోయెను.

ఇప్పటికి నేను సంకల్పించిన కార్యములన్నియు 108 కళ్యాణములు 125 కాశీలింగ ప్రతిష్ఠలు సహా నేరవేరెను. ఒక గ్రంథ ప్రకటనము మాత్రమే నిలిచియుండెను. కావున సహస్రనామ పూజను శ్రీరామ బ్రహ్మగేయములు అను మఱికొన్ని గేయములను జేర్చి దీనిని ప్రకటించుచున్నాను.

తామందరీ సేవా భాగముల జరుపుచు ఆనంద సముద్రమున నోలలాడుటయేగాక స్వామి వారి కరుణాకటాక్ష వీక్షణమునకు బాత్రులు గావలయును. ఇదియే విజ్ఞాపనము,

ఈ కీర్తనల తమ మందిరములలో బాడుచున్న వారికి నీ గ్రంథముపై నభిప్రాయము లిచ్చిన వారికి దీని ముద్రణకు బోషకాది చందాలిచ్చిన వారికి కృతజ్ఞత. వీరినందరిని మా బ్రహ్మేంద్ర స్వాముల వారు రక్షించుగాత!

ఇట్లు గ్రంథ కర్త ఇం॥శ్రీ॥ శర్మ

మద్రచిత బ్రహ్మేంద్ర చరిత్రముల చదివినవారు

నన్నడిగిన ప్రశ్నలు, నేనిచ్చిన జవాబులు,

వినవారు : ఏమండి! మీ గ్రంథములలో బ్రహ్మముగారి కడకు సిద్దయ్య యుపదేశమునకు వచ్చినప్పుడు, గోవిందమ్మ వెళ్ళిపొమ్మనినట్లు లేదే?

నేను : ఆమెందుకు వెళ్ళిపొమ్మనును? పెండ్లిగాక పూర్వము తనకు వచ్చు వరుడింక మూడు రోజులకు వచ్చునని చెప్పెను. తండ్రి చూడ వచ్చినప్పుడు వంట జేయకయె వేడి వేడి పదార్థములతో భోజనము పెట్టెను. అట్టి యామె ఆజ్ఞానురాలు వలె సిద్దని వెళ్ళగొట్టునా?

చది,విని : గోవిందాచార్యాది సోదరులు కులహీనుండవగు నీ కుపదేశమా? యని సిద్దని పైకి కరవాలములతో నురికి నట్లును లేదే?

నేను : అట్లురుకుటకు వారజ్ఞానులు కారు, వారు లోకోద్ధారకులు మహానుభావులు సమరసభావులు నగుదురు, అట్టి వారు కుల భేదములు బాటించి సిద్దని పై కురుకుదురా? 'కులమెంచగా నేల గుణము కారణమని గదా వారు భోధించునది.

చది,విని : బ్రహ్మము గారు సిద్దనిపై కురుకు కుమారుల 'నూర కుండుడీ, యని బ్రతిమలాడినట్లు లేదే?

నేను : భగవంతుడు బ్రహ్మముగారు దుర్మార్గుల సన్మార్గుల జేసి భక్తులొందు బాధల దొలగించిన బ్రహ్మము గారు యింటిలోని కుమారుల వశపరచు కొనలేక సామాన్యుల విధమున బ్రతిమలాడునా?

చది, విని : సిద్దయ్య గురుపుత్రులతో దమవంటి వారు కులభేదముల బట్ట వచ్చునా? యని నీతుల బలుకుట కూడలేదే?

నేను : విజ్ఞానా గ్రేసర చక్రవర్తులగు గురుపుత్రులెక్కడ అల్పజ్ఞుండగు సిద్దడెక్కడ? ఇంక నీతండా? 'గ్రుడ్డువచ్చి పిల్ల నెక్కిరించినట్లు' వారికి నీతుల బలుకుట బాగుగానేయున్నది.

చది, విని : ఈశ్వరమ్మగారి సలహా కూడ లేదే?

నేను : ఈశ్వరమ్మగారి సలహాతో నేమి పని? తాతగారు 153 సంవత్సరముల వారు తండ్రిగారు 80 సంవత్సరముల వారు వీరికుభయులకు దెలియని పక్షమున షుమారు 20 సంవత్సరము లీడు గల యీమె సలహా చెప్పుటయా?

చది,విని : సిద్ధయ్యే పూలదెచ్చి యించుకైన దుఃఖింపలేదే?

నేను : సిద్ధయ్యే నిత్యానిత్య వస్తు వివేకము గలవాడు. కాక తారక సాంఖ్య అమనస్క పరిపూర్ణము లయ్యేగారి దగ్గర చక్కగా గ్రహించిన దిట్ట, సిద్ధవటములో నల్లరాతికి నమస్కరించి సహస్ర శకలంబుల జేసిన మేటి అట్టివాడు హా! వీరగురూ! నన్నొంటరిగ జేసిపోతివా? నాకు దిక్కెవరు?' అని ఘోరముగా దుఃఖించునా? అగ్నికి జదలంటునా? పరిపూర్ణునకు దుఃఖము గలదా?

చది, విని : అయ్యా మీరిప్పుడు చెప్పిన జవాబులన్నియు నిజముగా నున్నవి, మాకు నచ్చినవి, ఇట్టి మార్పు లింకేమేమి జేసితిరో వానిని బూర్తిగా వినిపించవలయును?

నేను : నేనిపుడా మార్పులన్నియు నెక్కడ జెప్పగలను? వానినన్నిటిని బ్రహ్మేంద్ర సర్వస్వమను గ్రంథమున వ్రాసినాను, ప్రకటమైన పిదప నందు జూడుడు.

చది, విని : ఇక వచ్చెదము

నేను : నమస్తే.

# శ్రీమత్ద్గోవిందా భగవతి సమేత

# శ్రీ మద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి దేవస్థానం

## లింగంగుంట గ్రామము,

## ప్రకాశం జిల్లా.



శాశ్వత పూజారి :

**బ్రహ్మశ్రీ ఆదిమూలం చిన్మయాచార్యులు గారు**

ఓమ్

# శ్రీ బ్రహ్మేంద్ర సేవా దర్పణము

## ప్రథమ భాగము

## బ్రహ్మేంద్ర నామ సంకీర్తనము

శ్రీ విరాట్ బ్రహ్మేంద్రస్వాముల వారికి జై
శ్రీ మదాది శక్తి గోవిందా భగవతికి జై
శ్రీ మన్మాతా ఈశ్వరీ భగవతికి జై
శ్రీరామ బ్రహ్మస్వాముల వారికి జై

శ్రీ అన్నాజీ వరద బ్రహ్మేంద్రో హరిః
శ్రీ ఏకాంబ్ర వరద బ్రహ్మేంద్రో హరిః
శ్రీ చిదంబర వరద బ్రహ్మేంద్రో హరిః
శ్రీ సిద్ధయ్య వరద బ్రహ్మేంద్రో హరిః
శ్రీ మద్గోవిందాంబికా రమణ బ్రహ్మేంద్రో హరిః

## విజ్ఞాపన గేయము

1. శ్రీ రఘురామం భజరే భజరే వలె

వీర బ్రహ్మ స్వాముల భక్తి ప్ర। చారము సంకల్పించితిమి
శ్రీరామబ్రహ్మ శ్రమమును యా। శ్రితులారా। స్థాపించితిమి ॥వీర॥

మఱియు సేవ పెంపొందగ భక్త స। మాజ శాఖ నెల కొల్పితిమి
పరగస్వామి నిర్దోష గ్రంథః। ప్రకటన శాఖను నిల్పితిమి ॥వీర॥

కరము భక్తులకు గావలసిన యుప। కరణశాఖ నేర్పరచితిమి
నరుల కొఱకు నామ క్రియా శాఖను। నందముతో నిర్మించితిమి ॥వీర॥

ఇట్టి శాఖలను గల్గిన సంస్థను। వృద్ధి చేయుడో జనులారా।
గట్టిగ శ్రీరామ బ్రహ్మము వి। జ్ఞాపన వినుడో ప్రజలారా ॥వీర॥

## భాగ్యవంతు లెవరు?

2. నిను విడచి యెట్టులుందుర వలె

భాగ్యవంతులనగ నెవ్వరు? ప్రజలార। నిజముగ ॥భాగ్య॥
భాగ్యవంతులమనగ నెవరు? ✧ ప్రతిదినంబు బ్రహ్మము గారి
భక్తి నామ కీర్తనంబు ✧ పరగజేయు వారె గాక ॥భాగ్య॥
పాపాత్ముల జేరనీక ✧ పరకాంతల దరికిబోక
పాపమాంబ ప్రియకుమారుని ✧ భజన జేయు వారెగాక ॥భాగ్య॥
జింహ చాపల్యంబుగట్టి ✧ చింతలన్ని విడచిపెట్టి
జేజెనాయన శ్రీప్రభాత ✧ సేవజేయు వారెగాక ॥భాగ్య॥
వైరములకు నేమిదిగక ✧ వాదములను బెట్టుకొనక
వీర నారాయణుని పూజ ✧ వేడ్క జేయు వారేగాక ॥భాగ్య॥
స్థిర సుఖమిడి పగలు రేలు ✧ శ్రీరామాఖ్య కవిని నేలు
సిద్ధగురుని నిత్యేకాంత ✧ సేవజేయువారె గాక! ॥భాగ్య॥

## ఆహ్వాన గేయములు

3. జాలము యేలనుర వలె

వీరబ్రహ్మ నామ ధనము✧ వేడ్కగూర్పగ రండయ్యా।
వేడ్క గూర్పగ రండయ్యా ✧ వృద్ధిచేసి కొండయ్యా। ॥వీర॥
చోరులకిది యలవిగాదు ✧ క్షోణీశుల పరముగాదు
వైరులకు వశము గాదు ✧ వారసులకు హక్కు లేదు ॥వీర॥
పంచుకొనగ వీలుగాదు ✧ భార్యకు చేజిక్కబోదు
ఉంచుకొనగ భయము లేదు ✧ యిందుకైన పన్నులేదు ॥వీర॥
ధారుణీస్థలముననున్న ✧ దాసజనవరేణ్యులార
శ్రీరామబ్రహ్మమునకు ✧ స్నేహితులైన వారలారా! ॥వీర॥

4. ఆనందభైరవి - ఆటతాళం

వీరబ్రహ్మేంద్రనా। మామృతమనుమందు। వేదినగరారయ్యా! భూరి భవరోగముల। బారదోలెడి మందు । ఘోర పాపంపబుల గొట్టి వేసెడి మందు । క్రూరగ్రహముల బాధలను ని। ర్మూలముగ నొసరించు మందు। గుణము లేనటువంటి వారికి । గుణము గల్గగ జేయుమందు ॥వీర॥

అష్టకష్టంబుల। నపహరించెడి మందు। నందికొనరారయ్యా! అష్టమదంబుల। నడచివేసెడిమందు। యిష్ట కామ్యంబుల। నిచ్చు నట్టి మందు। దుష్టసాంగత్యంబు తృటిలో। ద్రుంచి వేయగ జాలు మందు। శిష్టజన సంఘంబునకును ప్ర। తిష్ఠ నెంతయు గూర్చు మందు ॥వీర॥

కరము తాపత్రయము। గాల్చి వేసెడి మందు। గ్రహియింప రారయ్యా। దరిలేని యీషణ । త్రయము నొంచెడి మందు। అరిషడ్వర్గము నెపుడో। హతము జేసెడిమందు । నరకముల నెటు వంటి వైనను । నాశనము గావించు మందు । అరటి ఖర్జూరాది ఫలముల। కన్న మించిన తీపి మందు ॥వీర॥

ఆసతో నత్ర్యా చా। ర్యులు సేవించిన మందు। దీనికొన రారయ్యా। వాసిగ భోజదం। పతులు గైకొను మందు। వరరెడ్డి భార్యాభ। ర్తలు గ్రహించిన మందు। దాసులగునన్నా జియాదులు। దాచుకొని భుజియించు మందు। ధరణి శ్రీరామాఖ్య కవినా। తనపురంబున నొసగు మందు ॥వీర॥

5. శ్రీరామ జయరామ వలె

ఓమ్ నమశ్శ్రీవీర నారాయణాయ

ఓమ్ నమో గోవిందమాంబేశ్వరాయ

Note : ఈ నామమను శక్తికొలది చేయవలయును

6. శ్రీకృష్ణచైతన్య ప్రభునిత్యానందం వలె

వీరబ్రహ్మేంద్రా। శ్రీ। వీర బ్రహ్మేంద్రా!
కారుణ్యహృదయ శ్రీ। వీర బ్రహ్మేంద్రా! ॥వీర॥
పాపాంబముద్దుల। పట్టి బ్రహ్మేంద్రా!
భక్తజనోల్లాస! బాలబ్రహ్మేంద్రా! ॥వీర॥
అద్యంత రహిత! వే। దాంత బ్రహ్మేంద్రా!
అఖిలార్ధ ప్రద। పరమా। హ్లాద। బ్రహ్మేంద్రా! ॥వీర॥
షడ్శాస్త్ర పారీణ। స్వామి। బ్రహ్మేంద్రా!
సమరసభావ! ప్ర । జ్ఞాన బ్రహ్మేంద్రా! ॥వీర॥
భావజాకారా! గో। పాల బ్రహ్మేంద్రా!
భక్త శ్రీరామకవి! వరద। బ్రహ్మేంద్రా! ॥వీర॥

7. రాధారమణమదన మోహన వలె

వీరభోజనందన బ్రహ్మం। విశ్వోత్పన్న కారణ బ్రహ్మం
భూరికలుష శోషణ బ్రహ్మం। పూజ్య పాదకమల। బ్రహ్మం ॥వీర॥
మకర కుండల భూషణ బ్రహ్మం। మదనకోటి సుందర బ్రహ్మం
సకల జీవతరణ బ్రహ్మం। సాధుసజ్జనరక్షక బ్రహ్మం ॥వీర॥
విమల సద్గుణ బృంద బ్రహ్మం। విదళిత భవబంధ బ్రహ్మం
సమధిక మునిసదన బ్రహ్మం। శాత కుంభవసన బ్రహ్మం ॥వీర॥
శుద్ధయశ్యస్సాంద్ర బ్రహ్మం। సోమ సూర్య నయన బ్రహ్మం
సిద్ధభక్త వరద బ్రహ్మం। శ్రీరామఖ్యా సేవిత బ్రహ్మం ॥వీర॥

## 8. గురు మహారాజ గురు మహారాజ వలె

శ్రీ వీరదేవ। శ్రీ వీరదేవ। శ్రీ వీరదేవ। స। ద్గురు వీర దేవ ॥శ్రీ॥
విశ్వ మోహన రూప। శ్రీ వీరదేవ। విద్యజ్ఞనాధార। శ్రీ వీర దేవ। ॥శ్రీ॥
ధర్మ సంస్థాపక శ్రీ వీరదేవ। తత్వార్థ ప్రతిపాద। శ్రీ వీరదేవ। ॥శ్రీ॥
వారిజాయత నేత్ర। శ్రీ వీరదేవ। వాచమగోచర। శ్రీ వీరదేవ। ॥శ్రీ॥
క్షితినాధ పరిపాల। శ్రీ వీరదేవ। శ్రీరామకవిలోల। శ్రీ వీరదేవ। ॥శ్రీ॥

## 9. జేజేసీతారాం జేజే రఘురాం వలె

జేజేవీర బ్రహ్మం। జేజే విరాట్బ్రహ్మం
జేజే గోవిందాంబ। జీవితేశ్వర।బ్రహ్మం ॥జే॥
శ్రీమదన్నాజయ్య। శ్రేయోదాయక। బ్రహ్మం
శ్రితలోక హృదయ రా। జీవ భాస్కర। బ్రహ్మం ॥జే॥
అఖిలాండ కోటి బ్ర। హ్మాండ నాయక। బ్రహ్మం
అచ్చమ్మ వినుత। పా।దాంబుజయుగ। బ్రహ్మం ॥జే॥
కందిమల్లయ పల్లె। గ్రామనివసిత। బ్రహ్మం
కంజాక్ష శ్రీరామ। కవి సేవిత। బ్రహ్మం ॥జే॥

## 10. రామ రామ రామ సీతా వలె

దేవ। దేవ। దేవ। వీర। దేవ। దేవ। దేవ। వీర।
శ్రీ పాపఘ్న పీఠాధ్యక్షా। శ్రితజన సంసేవిత। కమలాక్షా ॥దేవ॥
ఛత్ర చామరాదిక బిరుదాంకా। చలన రహిత। తనుజిత మీనాంకా।
పుష్పగిరి బ్రహ్మారథారోహా। భువనత్రయ జీవావళి గేహా ॥దేవ॥
శ్రీరామబ్రహ్మా శ్రమవాసా। శ్రీరామార్చితపద। సువిలాసా ॥దేవ॥

అవసర నైవేద్యము

స్వామి వారి ముందు బెట్టి ఈ కీర్తన పాడవలయును

11. తోడి రాగము - రూపక తాళము

వీరదేశికా। మహాత్మా। యారగింపవే

పచ్చికొబ్బెర। బత్తా నారింజ। ఫలములరటి పండ్లు చక్కెర।
హెచ్చు భక్తి తోడ స్వామి। యివిగో సమకూర్చినారము ॥వీర॥

మామిడిపండ్లు జామకాయలు। మఱికమలాఫలములెంతో
ప్రేముడిగొని తెచ్చి ముందు। బెట్టి నివేదించినారము ॥వీర॥

పానకంబు గుడమును వడ। పప్పు నాన బ్రాలు దెచ్చి।
భక్త శ్రీరామాఖ్య వినుత। పరమశ్రద్ధనుంచినారము ॥వీర॥

మంగళహారతి

12. కాంభోజి రాగం - ఆదితాళం

శ్రీ వీరాబ్రహ్మేంద్ర దేవునకు। మం। గళ మిదె ఘనునకు ॥శ్రీ॥

భావజ శతకోటి।లావణ్య రూపునకు । బ్రహ్మాండముల నెల్ల। పాలించు ప్రభువునకు । దేవాధి దేవునకు। దివ్య ప్రభావునకు। భావిజ్ఞునకు సర్వ। భాషా ప్రవీణునకు ॥శ్రీ॥

మానుగ శిశురూపు ధరియించి। సరస్వతీమ। హానదీ తీరమున దీపించి। ఆనందమత్రా। చార్యులకు గలిగించి। అంత పాపాంబ గృ హంబుననివసించి। జ్ఞానంబు నొగిదాక్షి ణాత్యులకు బోధించి క్రమముగ హరిహరవు। రంబునకు వచ్చిన॥శ్రీ॥

గరిమబన్గానప్పల్లె జరియించి। అచ్చమ్మ గోవుల। గాయుచును కొండపయివసియించి। కరమొప్పగా కాల। జ్ఞానంబు లిఖియించి।

కడజేరునన్నాజి । కయ్యేది వినిపించి। గరిమి రెడ్డచ్చమ్మ గారిని రక్షించి। కదలియల్లాడ్పల్లె। గ్రామముననుండిన ॥శ్రీ॥

కందిమల్లయపల్లె కేతెంచి। మహిమాఢ్యయగు గో। విందమాంబ కరంబు గ్రహియించి॥ ముందు చందానడుగ। పొలెరిరప్పించి। పుత్రుల నేవురిని। పుత్రికనున్ గాంచి। వందారుసిద్ధాది భక్తుల గటాక్షించి। వరపశ్చిమ క్షేత్ర। వాసులను నేలిన॥శ్రీ॥

సిద్ధవట భూపతిని మెప్పించి। శీతాద్రి వరకా। శ్రితులతో సంచార మొనరించి। శుద్ధాత్ములగు భక్త। వరుల బాధలడంచి। సొంపారగా జీవ। సమాధియైమించి। పెద్ధ కొత్తపల్లి యాశ్రమంబున నిల్చి। ప్రేమార శ్రీరామ। బ్రహ్మమును బ్రోచిన॥శ్రీ॥

## 13. పరిపూర్తి గేయము

శ్లో॥ గోవిందమాంబా। హృదయాబ్జ భృంగం। రాజన్య సంపూజ్య పదారవిందం।
కోటీరహరాదికను ప్రభూషం। శ్రీ వీరదేవం శిరసానమామి

శ్రీసంధాయక। బ్రహ్మేంద్రా। శ్రితజన రక్షక। బ్రహ్మేంద్రా।
అచ్చుమవంద్యా। బ్రహ్మేంద్రా। అచలాకారా। బ్రహ్మేంద్రా।
వీరవసంతా। బ్రహ్మేంద్రా। వేదాంతసాగర। బ్రహ్మేంద్రా।
శ్రీరామార్చిత। బ్రహ్మేంద్రా। శిష్టజనావన। బ్రహ్మేంద్రా।

## 14. ఆనందం బ్రహ్మానందం

ఆనందం బ్రహ్మానందం ఆనందం బ్రహ్మానందం
బ్రహ్మానందం బ్రహ్మానందం బ్రహ్మానందం బ్రహ్మానందం
బ్రహ్మానందం బ్రహ్మానందం బ్రహ్మానందం బ్రహ్మానందం
ఆనందం బ్రహ్మానందం ఆనందం బ్రహ్మానందం
శ్రీ మద్గోవిందా భగవతీ రమణ బ్రహ్మేంద్రో హరి॥

## అపరాధ స్తోత్రము

### 15. అరభిరాగము - ఆదితాళము

వీర గురూ। నను। క్షమించి కృపతో । వేగ గావు మయ్యా।
క్రూరుడ నైయతి। కుచ్చితమతినై। నేరము లేనెనెన్ని జేసితినో ॥వీర॥

భావలోపములగాన లోపముల బహు విధ వ్యాకరణాది లోపముల
భక్తిమంత్ర సత్క్రియాలోపముల। బాగుగ తెలియక నెన్ని
జేసితినో ॥వీర॥

మాతృద్రోహము పితృ ద్రోహము। భ్రాతృద్రోహము బంధు ద్రోహము
మఱియు మిత్ర దేశిక ద్రోహంబుల। మహిలో నేనింకెన్ని
చేసితోనో ॥వీర॥

చీమల ద్రొక్కుట దోమల నలుపుట। చీరపోతులను నల్లుల
జంపుట। పాముల తేళ్లను గొట్టుట మొదలగు। పాపంబుల
నింకెన్ని జేసితినో ॥వీర॥

శ్రీరామ బ్రహ్మాశ్రమమని యెడి। పేరున నొక సంస్థను స్థాపించి ప్ర
చారము భక్తిని గూర్చి జేయు కవి। శ్రీరామబ్రహ్మాహ్వాయ
సన్నుత ॥వీర॥

## సెలవు

### 16. జయమంగళంబిదె గొనుమా వలె

సెలవిమ్ము శ్రీ బ్రహ్మేంద్రా। జే।
జేలు సద్గుణ సాంద్రా। జే।
జేలు సద్గుణ సాంద్రా। నీ।
సేవకులకు సుధీంద్రా। ॥సెల॥
కలవెన్నో కార్యములయ్యా।సలు।
పంగబోవలెనయ్యా। సలు

పంగబోవలెనయ్యా । చని।
వెంట వచ్చెద మయ్యా। ॥సెల॥
క్షితినాధ హృదయ నివాసా। శ్రిత।
రక్ష। రత్న విభూషా। శ్రిత।
రక్ష। రత్న విభూషా। శ్రీ।
రామకవి పరిపోషా। ॥సెల॥

గద్య
ఇది శ్రీమద్బ్రహ్మేంద్ర భక్తి ప్రచారక, బ్రహ్మేంద్రదత్త
'కవివతంస' బిరుదాంక, శ్రీరామబ్రహ్మనామక
శ్రీరామశర్మ ప్రణీతంబైన
శ్రీ బ్రహ్మేంద్ర సేవా దర్పణములోని
ప్రధమ భాగము
బ్రహ్మేంద్ర నామ సంకీర్తనము
సంపూర్ణము
ఇచ్చటజై శబ్దములు పల్కవలయును,
భక్తులు ప్రసాదము దీసికొని వెళ్ళవలయును



ఓమ్

# శ్రీ బ్రహ్మేంద్ర సేవా దర్పణము

## రెండవ భాగము

### బ్రహ్మేంద్ర భజన

శ్రీ విరాట్ బ్రహ్మేంద్ర స్వాముల వారికి జై

శ్రీ మదాది శక్తి గోవిందా భగవతికి జై

శ్రీ మన్మాతా ఈశ్వరీ భగవతికి జై

శ్రీ రామ బ్రహ్మ స్వాముల వారికి జై

శ్రీ అన్నాజీ వరద బ్రహ్మేంద్రో హరిః

శ్రీ ఏకాంబ్ర వరద బ్రహ్మేంద్రో హరిః

శ్రీ చిదంబర వరద బ్రహ్మేంద్రో హరిః

శ్రీ సిద్దయ్య వరద బ్రహ్మేంద్రో హరిః

శ్రీ మద్గోవిందాంబికా రమణ బ్రహ్మేంద్రో హరిః

### 17. నిదురా పోక జూడరా వలె

శ్రీ వీరేంద్రుడు తండ్రి రా। గోవిందాంబ తల్లి రా।
పావనులగు మన గోవిందా చా। ర్యాది సహోదరులన్నలురా। ॥శ్రీ॥
వీరభోజుడు తాతరా। వీరపాపమాంబవ్వరా।
సారజ్ఞుండగు శివ కోటయ్యా। చార్యుడు మన జేజెయ్యరా ॥శ్రీ॥
సిద్దయ మన మిత్రుండురా। సేవకులే చుట్టాలురా।
స్థిరముగ వీరందరు మన యాశ్రమ। సీమలో నమన్నారురా ॥శ్రీ॥
భజనము నిత్యము జేయరా। పాపంబుల నెడబాయరా।
భక్తుడైన శ్రీరామబ్రహ్మము । పల్కు వినుము సుఖపడుదువురా॥శ్రీ॥

## 18. నేనే బ్రహ్మమురా వలె

భజన జేయండి। బ్రహ్మముగారి భజన జేయండి। సోదరులారా॥భజ॥

భజన జేయుడి । మీరు । గజి మిజి లేకుండ
అజరుద్రాదులు కూడా । నహరహముగావించు ॥భజ॥

జలకమాడియును, కా। షాయాంబరఘుల్ దాల్చి
తిలకములు ధరియించి। దివ్యపఠము బెట్టి ॥భజ॥

కంజీర హార్మోనియం । ఘన మృదంగము గూర్చి
కరతాళములబట్టి। కడు భక్తి పరవశత ॥భజ॥

భక్తుడౌ శ్రీరామ। బ్రహ్మ గేయముల, నా
సక్తిగ బాడుచు। జయధ్వనుల జెయుచు ॥భజ॥

## 19. శ్రీరాగము - ఆట తాళము

చేయుడీ। చేయుడీ। బ్రహ్మేంద్ర భజనము । చేయుడీ। చేయుడీ।
హితవర్యులారా ॥చే॥

చేయుడీ। సద్భక్తి తోడను। చింతలన్నిటి విడిచి పెట్టియు
ఆయురారోగ్యములు భోగము। లామహాత్ముడను గ్రహించును ॥చే॥

యాగముల జేయపనిలేదు । యోగములబట్ట పనిలేదు
ఆగమాంతము నేర్చుబని సుం। తైన లేదో యయ్యలారా ॥చే॥

కానలకు నేగబనిలేదు । గడ్డముల బెంచు పనిలేదు
కానీ కూడా వ్యయము లేదు । కాలహరణం బేల? కూర్చొని ॥చే॥

కుల విచారణము బనిలేదు । గొంతు బాగుండ బని లేదు
అలఘుప్రేమను భక్త శ్రీరా। మా ఖ్యుడిదె మిము వేడు చుండెను॥చే॥

## 20. కమాచి రాగము - ఆదితాళం

బ్రహ్మము గొల్వగ రారే ॥వీర॥ బ్రహ్మము గొల్లగ రారే
భక్తుల గావగ॥ ప్రభువగు వాడె ॥బ్ర॥
శరణాగతులను సాకెడు వాడె॥ సరగున పిలిచిన॥ పలికెడు వాడె
కరుణారసమును । జిలికెడు వాడె॥ కలుషంబుల నెడబాపెడు
వాడె ॥బ్ర॥
అచ్చమాంబికను । బ్రోచిన వాడె॥ అన్నాజయ్యను । గాచిన వాడె
చచ్చిన బాలుని॥ మనిపిన వాడె॥ సాధుజనుల పోషించిన వాడె ॥బ్ర॥
ధర్మస్థాపన॥ చేసినవాడె॥ తత్వబోధ గావించిన వాడె
ధన ధాన్యంబుల॥ నిచ్చెడి వాడె॥ ధరణీశుల నుతు లొందిన
వాడె ॥బ్ర॥
సిద్దని సంరక్షించిన వాడె॥ చింతితార్థముల॥ గూర్చెడు వాడె
స్థిరముగ నవపురి॥ నిలిచిన వాడె॥ శ్రీరామఖ్యుని॥ కృపగని నాడె ॥బ్ర॥
నోట్ : ఈ చరణమును తిరగి మిత్రగా బాడవలయును.

## 21. భారతదేశము మనదండోయి వలె

బ్రహ్మముగారిని నమ్మండోయ్ । భక్తిని సేవలు జేయండోయ్
బహుళాసక్తిని బ్రోవగ వచ్చిన । భగవంతుడు మనకాంతం డోయ్॥బ్ర॥
పిలచిన బల్కెడు వాడండోయ్॥ ప్రేమను జూచెడు వాడం డోయ్॥ తలిచిన
మాత్రనె కష్టములన్నియు॥ తప్పించెడు వా డాతండోయ్ ॥బ్ర॥
కారణమిచ్చెడు వాడండోయ్॥ కాలము దెల్పెడి వాడండోయ్॥
కరమారోగ్యము బాడిని పంటను॥ గల్గించెడు వాడాతండోయ్ ॥బ్ర॥
కోరువరములిడు వాడండోయ్॥ కొరవల దీర్చెడు వాడండోయ్॥
శ్రీరామబ్రహ్మాశ్రమవాసుడు॥ శ్రీరామార్చితుడాతండోయ్ ॥బ్ర॥
కోరువరములిడు వాడండోయ్॥ కొరవల దీర్చెడు వాడం
డోయ్॥ శ్రీరామబ్రహ్మాశ్రమవాసుడు॥ శ్రీరామార్చితుడాతండోయ్ ॥బ్ర॥

## 22. జనని జానికమ్మ వలె

అన్న వస్త్రములిచ్చు ప్రభువైన శ్రీవీర।
హరిని సద్భక్తి భజింపర యా।
అల్పులను నమ్మికొని ఆహారమున కెపుడు
అంగలార్చిన సౌఖ్యమేమిటయా। ॥అ॥
ఆయురారోగ్యంబు లైశ్వర్యముల గూడ
నవలీలగా నాతడొసగునయా।
అంతేగాదు మోక్ష సామ్రాజ్యమును గూర్చు।
నట్టి జగద్వంద్యుడతడేనయా। ॥అ॥
కాలజ్ఞానంబును మనకొరకు రచియించి।
కారుణ్యమున దయచేసేన యా
చాలగ వేదాంత తత్వంబులను జేసి
చాటున గూర్చొనియున్నాడయా। ॥అ॥
వీరభోగవసంత రాయలనెడి పేర।
విశ్వమునకు కరుదెంచనున్నాడయా।
శ్రీరామబ్రహ్మంబు చేతను భక్తి ప్ర।
చారంబు చేయుంచుచున్నాడయా। ॥అ॥

## 23. శంకరాభరణము - ఆదితాళము

వీరదేవుని భజన జేతము। ప్రియులార। మనము ॥వీర॥
భూత భవిష్యముల దెలసి। భువి జనంబులు బాగుపడగ
చేతమలర కాలజ్ఞానము। జేసి మఠము నందు నుంచిన ॥వీర॥
భేద భావముల నడించి। ప్రేమను నను నమ్మ వారి
నాదరింతునంచులోక। మన్ని దిశల యందు చాటిన ॥వీర॥

మానవ గణమంత సరిస।మానమంచు దివ్యమైన
జ్ఞాన బోధ చేసి జనుల। కైకమత్యము బాదుకొల్పిన ॥వీర॥
పరగనన్నాజయ్య నేకాం। బరచిదంబరాది భక్తుల
గరుణనరసి ముక్తి వారికి । గరతలామలకంబు జేసిన ॥వీర॥
భక్తి ప్రచారంబు మహా। సక్తిని గావించు శ్రీ మ
ద్భక్త శ్రీరామఖ్యు కోర్కెలు। బహువిధంబుల దీర్చుచుండిన ॥వీర॥

## 24. పాడవే రాట్నమా వలె

బ్రహ్మ సప్తాహంబు। జేయాలి చేయాలి
ప్రజలార। మీరంత। రావాలి రావాలి ॥బ్ర॥
పరగజై శబ్ధములు। పలుకాలి పలుకాలి
కరతాళములు చేత। వేయాలి వేయాలి ॥బ్ర॥
అహరహము నామంబు। జరుపాలి జరుపాలి ॥బ్ర॥
ఆనంద బాష్పములు । విడువాలి విడువాలి ॥బ్ర॥
చేసిన పాపంబు । పోవాలి పోవాలి
శ్రీరామకవి కోర్కె । దీరాలి తీరాలి ॥బ్ర॥

## 25. ధన్యాసి - ఆదితాళం

బ్రహ్మము గారిని నమ్మినవారు। బాగుపడినవారు
భక్తి నాయనను నమ్మకపోతె। ఫలితముగన లేరు ॥బ్ర॥
అచ్చమనన్నాజిని నేకాంబరు। నాదరించె గాదా
చచ్చిన బాలుని కక్క... భార్యను । వచ్చిమ... పలేదా ॥బ్ర॥
కలియుగంబునకు నాతడె ప్రభువై। గ్రాలుచుండెనమ్మ
కడుమన సంకటముల దీర్చుటకై। కాచి యుండెనమ్మా ॥బ్ర॥

సకలారిష్ట మూలాయన కృప చే। సరగదొలగునయ్యా
ప్రకటితముగ నిద్ధాత్రిని శిరి సం। పదలు గలుగునయ్యా ॥బ్ర॥
సోదరీమణులారా। నేడే। స్తుతులు చేయరండీ।
సోదరులారా। శ్రీరామాఖ్యుని। సూక్తులను వినండి ॥బ్ర॥

## 26. శ్రీ రఘురామం భజరే భజరే వలె

బ్రహ్మము గారిని నమ్మక పోయిన। ప్రజలారా। లాభము లేదు భక్త
సంఘమును బ్రోవగ నాతడు। వచ్చి యున్నవాడు ॥బ్ర॥
కూరుచున్న వార్కూర్చున్నట్లుగ। కూలే కాలము వచ్చినది. ఊరూరను
శక్తులు ప్రభవించెడి । యోగము దావలమైనయదీ ॥బ్ర॥
ఏడూళ్ళకు నొక్కూరగు సమయం। బేతెంచుచునున్న యదీ
కూడులేక నల్లాడెడు తరుణము । కొద్దిలోనె రానున్న యదీ ॥బ్ర॥
దుర్జనములు సాధుల బాధించెడి। దుస్థితి మీరుచునున్న యదీ
నిర్జలమయ్యేయదును క్రమంబుగ। నెట్టుకవచ్చుచునున్న యదీ ॥బ్ర॥
మారీస్ఫోటక మిత్యాదులచే। మ్రగ్గువేళ కానున్న యదీ
శ్రీరామాఖ్యుని సూక్తుల వింటె। క్షేమము నిజముగనున్నయదీ ॥బ్ర॥

## 27. ఇక్ష్వాకుకులతిలక వలె

సకల శుభంబుల। సమకూర్చు మంత్రము । బ్రహ్మమంత్రం
సర్వరోగంబుల। సడలించు మంత్రము। బ్రహ్మమంత్రం ॥స॥
దురితసంచయములను। హరియించు మంత్రము। బ్రహ్మమంత్రం
దుస్వప్న ఫలితముల। దొలగించు మంత్రము । బ్రహ్మమంత్రం ॥స॥
భుక్తి ముక్తులనిచ్చు। భువనైక మంత్రము। బ్రహ్మమంత్రం
భూతప్రేతంబుల। భోగొట్టు మంత్రము । బ్రహ్మమంత్రం ॥స॥

ఆపదల దేలించు। నటువంటి మంత్రము । బ్రహ్మమంత్రం
పాపలగలిగించు। నటువంటి మంత్రము । బ్రహ్మమంత్రం ॥స॥
ధారుణి సిద్ధయ్యా। నుష్ఠానుమంత్రము। బ్రహ్మమంత్రం
శ్రీరామ బ్రహ్మము। జపియించు మంత్రము । బ్రహ్మమంత్రం ॥స॥

28. శ్రీరాగము - ఆదితాళము

శ్రీ విరాట్పోతులూరి। బ్రహ్మేంద్రా। నీకు
జేజేల జేసెదము। బ్రహ్మేంద్రా।
రావయ్య వీరబ్రహ్మేంద్రా। శ్రితుల
రక్షింప భువి పైకి। బ్రహ్మేంద్రా। ॥శ్రీ॥
వీరేంద్రసతి గోవిందాంబా। నీకు
వేడ్కలు శ్రీగోవిందాంబా।
రారమ్మ శ్రీగోవిందాంబా। శ్రితుల
రక్షింప భువికి గోవిందాంబా ॥శ్రీ॥
సారజ్ఞ గోవిం। దాచార్యా। నమ
స్కారంబు గోవిం। దాచార్యా।
రారమ్మా గోవిం। దాచార్యా। శ్రితుల
రక్షింప భువికి గోవిం। దాచార్యా। ॥శ్రీ॥
నారీశిరోమణి। యీశ్వరమ్మా। భక్త
శ్రీరామ కవినుత । యీశ్వరమ్మ।
రారమ్మ కరుణతో। నీశ్వరమ్మా। శ్రితుల
రక్షింప భువిపైకి ।నీశ్వరమ్మా ॥శ్రీ॥

### 29. రాఫీ రాగము - ఆదితాళం

రార। శ్రీ బ్రహ్మేంద్ర। రార । సద్గుణ సాంద్ర।
రారా। దేశిక చంద్ర। రక్తిగనిదె లేచి ॥రా॥
వీరభోగ వసంత। రాయులనెడి పేర
వీర ధర్మంబుల। వెదజల్లుటకు వేగ ॥రా॥
ధర్మంబులామారె। దుర్మార్గమా హెచ్చె
దయతోడ నీ భక్త। తతినుద్ధరించుటకు ॥రా॥
కల్లనిజంబయ్యె। కలహములు మెండయ్యె
కలినుండ జాలమింక। కవిశ్రీ రామాఖ్యనుత ॥రా॥

### 30. విరలా శ్రీ కృష్ణ వలె

జయశ్రీ బ్రహ్మేంద్రా। జగధీశ। బ్రహ్మేంద్రా।
జలజాసనాదినిర్జరవినుత బ్రహ్మేంద్ర। ॥జ॥
పాపాంబ దంపతుల। బాలింప బ్రహ్మేంద్ర।
పాపఘ్ను మరమందు। ప్రబలితివి బ్రహ్మేంద్ర। ॥జ॥
అచ్చమాంబిక దంప। తుల నేల బ్రహ్మేంద్ర।
అలబన్గానపల్లెలో। నలరితివి బ్రహ్మేంద్ర। ॥జ॥
కలభక్తజనుల జక్కగ బ్రోవ బ్రహ్మేంద్ర।
కందిమల్లయపురిని। గ్రాలితివి బ్రహ్మేంద్ర। ॥జ॥
శ్రీరామాఖ్యుని సంరక్షింపగ బ్రహ్మేంద్ర।
క్షితనవ్య పురమునకు । జేరితివి బ్రహ్మేంద్ర। ॥జ॥

### 31. సర్వమంగళారామ వలె

శ్రీమత్పోతులూరి వీర। బ్రహ్మం బ్రహ్మం।
కామితముల నిడుము। వీర। బ్రహ్మం బ్రహ్మం। ॥శ్రీ॥

సృష్టిస్థితిలయకారణ। వీర। బ్రహ్మం బ్రహ్మం।
కష్టముల దీర్పగదే। వీర। బ్రహ్మం బ్రహ్మం। ॥శ్రీ॥
పాపమాంబ తనయా। వీర। బ్రహ్మం బ్రహ్మం।
పాపులని విడకయ్య । వీర। బ్రహ్మం బ్రహ్మం। ॥శ్రీ॥
మారకోటి సుందర। వీర। బ్రహ్మం బ్రహ్మం।
శ్రీరామ బ్రహ్మార్చిత। వీర। బ్రహ్మం బ్రహ్మం। ॥శ్రీ॥

### 32. జయహారతిదె పాండురంగ వలె

బ్రహ్మేంద్ర దేవ। కందిమల్లయ। పట్టణవాసా। భావజసన్నిభ
విలాస। భక్త జనపోషా। సర్వ। భక్త జనపోషా। ॥బ్ర॥
అడవి కొండభూముల నడచి। యలసివచ్చితిమి। కడురయమున
మాదు కష్టము। లుడుపమంటిమి। కష్టము। లుడుపమంటిమి ॥బ్ర॥
మించు భవన్మఠము విలో।కించినారము। అంచితముగత్వత్స
మాధి। గాంచినారము। పాద। గాంచినారము ॥బ్ర॥
చేతమలర మమ్మునిండ్లకు। జేర్పు మోయయ్యా। సేవజేయు
శ్రీరాముఖ్యుని। గావవేయయ్యా। స్వామి। బ్రోవవేమయ్యా ॥బ్ర॥

### 33. శరణం భవ తరగంము వలె

బనగాన్పుర। జననన్నుత। పదపంకజ। బ్రహ్మం
మణి సంస్థిత। మకుటాదిక। ఘన భూషణ। బ్రహ్మం ॥బ్ర॥
సురకిన్నర। గరుడోరగ। పరిరక్షక। బ్రహ్మం
నెరనమ్మితి। దురితాంబుధి। దరిజేర్చవె బ్రహ్మం ॥బ్ర॥
నృపవీరుల। కపవర్గము। నిడిబ్రోచిన బ్రహ్మం
అపరాధిని। కృపజూడుము। నెపమెన్నక బ్రహ్మం ॥బ॥
శ్రిత జీవన। గతినీవని। మతినెంచితి బ్రహ్మం
క్షితిలోపల। శ్రీరామా। ఖ్యుని గాచిన బ్రహ్మం। ॥బ్ర॥

34. ఆనందమానంద మాయనే వలె

ఇతడే గదా మన బ్రహ్మేంద్ర మూర్తి॥ఇ॥ మన వరహాల తండ్రి ॥ఇ॥

మనవజ్రాల తండ్రి॥ఇ॥ మన బంగారు కొండ ॥ఇ॥

భక్తుల ప్రార్ధనముల। భాగుగ నాలించి। బయల్దేరి వచ్చి వారి

పరిపాలించిన దేవు ॥డీ॥

ద్వైతమార్గంబున। ద్వైతమార్గంబును। భూతలమున మర్త్యులకు।

బోధించినట్టి ప్రభు ॥వి॥

హిందూ మహమ్మదీయుల। నేకీభవింప జేసి। పొందుగ వారి చేత।

పూజలందినఘను ॥డి॥

శ్రీరామ బ్రహ్మాశ్ర। మంబున నివసించి। శ్రీరామ ...

రక్షించి నట్టి జగజ్జట్టి ॥ఇ॥

35.రామనామస్మరణామృత వలె

కలిలో ధర్మస్థాపన జేశిన। ఘనుడగు బ్రహ్మంబితడెగదా ॥యీ॥

తలచిన వారల ధన్యుల జేసెడు। తారక పురుషుండితడె గదా ॥క॥

చెప్పగలేదంటారని ముందే। శ్రితులకు మార్గము దెలిపె గదా ॥ఎటు॥

తప్పుత్రోవలకు బోకుడు శక్తులు। చప్పరించు మిమ్మనియెగదా ॥క॥

నమ్మువారి రక్షింతునని ప్రమా। ణం బొక్కటి గావించె గదా ॥నను॥

నమ్మక పోతె చెడిపోయ్యేరని। నరులకు దెలియగ బలికె గదా ॥క॥

శ్రీరామ బ్రహ్మాశ్రమమందున। క్షేమంబుగ నివసించె గదా ॥మా॥

శ్రీరామ బ్రహ్మాఖ్యుని కోర్కెలు। చెప్పకె తీర్చుచునుండె గదా ॥క॥

36. ధన్యాసి - ఆది

కందిమల్లయ పురీశ్వర బ్రహ్మమె। కన్న తల్లి మాకు

కాలజ్ఞాన గ్రంథకర్తయే। కన్న తండ్రి మాకు ॥కం॥

ఆదిశక్తి గోవింద మనాధుడే। యాచార్యుడు మాకు
బాధలుడుపుగో గణపాలకుడె। భగవంతుడు మాకు ॥కం॥
శుద్ధ చరిత్రుఁడు పాపమ సుతుడే। చుట్టమగునుమాకు
సిద్ధ హృదయరాజీవ భాస్కరుడే। స్నేహితుండు మాకు ॥కం॥
వీరగురుని భక్తి ప్రచారము। వృత్తి యగును మాకు
శ్రీరామ బ్రహ్మాశ్రమమే మ। స్థిర వాసము మాకు ॥కం॥

37. జన్మమేలనే వృథా జన్మ మేలనే వలె

ఎంతవాడవు। బ్రహ్మం। ఎంతవాడవు
చెంత గోవుల గీటు లోపల। చెదరకుండ నిల్పినావు। ॥ఎ॥
వింతగ ఫణిగరచి చచ్చు। బిడ్డని బ్రతికించినావు
కనుబడిసిద్దయ్యకు స్వప్న।మున రమ్మని చెప్పినావు ॥ఎ॥
అశ్వపిండము మగదెయనుచు। నపుడె దీసి చూపినావు
అగ్ని కాహుతి జేసివురము । సంతలో నగుపరచినావు ॥ఎ॥
చీల్చబడిన కక్కయసతి। కి జీవమిచ్చిలేపినావు
చెలగి భోజనంబుపూలను। ఫలముల గావించినావు ॥ఎ॥
ఎక్కడ లేనట్టివాన। నెంతో గురిపించినావు
మక్కువ పులిజేసిసిద్ధవి। మనసుగనగబంపినావు ॥ఎ॥
ఆదంబి కుమారునకు, ని।జాకృతి కనుపరచినావు
ఆయువిచ్చి శ్రీరామా। హ్వాయ భక్తుని బ్రోచినావు ॥ఎ॥

అవసర నైవేద్యము

సూచన : ఇచట స్వామి వారికి ముందవసర నైవేద్యము బెట్టి ఇందుగల నామ సంకీర్తపు చివర లోని వీర దేశికా మహత్మ యారగింపవె అను కీర్తన బాడవలయును.

38. శ్రీరాగము -ఆటతాళము

శుభమంగళం నిత్య। జయమంగళం। మా తండ్రి బ్రహ్మేంద్రునకు॥ శు॥ శుభమంగళము సర్వ। శుభములనిచ్చెడి। ప్రభురాణి। మా తల్లి। వర గోవిందమ్మకు ॥శు॥

పన్నుగ జ్ఞానసంపన్ను లైనట్టి మా। యన్నలౌ గోవింద। య్యాది సోదరులకు ॥శు॥ శాశ్వతమైన మో। క్షంబు నొసగు పర। మేశ్వరీ। జగదంబ। ఈశ్వరీ దేవికి ॥శు॥

శక్తివంతులు తప। శ్శక్తివంతులు జీవ। న్ముక్తులు సిద్దాది। భక్త పరంపరకు ॥శు॥ భక్తి ప్రచారమా। సక్తి గావించుస।ద్భక్తుడౌ శ్రీరామ। బ్రహ్మేంద్రనామునకు ॥శు॥

సూచన : ఇచ్చట నిందు గల నామ సంకీర్తనపు చివరిలోని శ్రీ సంధాయక, ఆనందం, బ్రహ్మానందం, వీర గురూనను క్షమించి సెలవిమ్ము, శ్రీ బ్రహ్మేంద్రా। అను కీర్తనల బాడి సరిపుచ్చవలెను.

గద్య

ఇది శ్రీ మద్బ్రహ్మేంద్ర భక్తి ప్రచారక, బ్రహ్మేంద్ర దత్త
'కవివతంస' బిరుదాంక, శ్రీరామ బ్రహ్మనామక
శ్రీరామశర్మ ప్రణీతం బైన
శ్రీ బ్రహ్మేంద్ర సేవాదర్పణములోని
రెండవ భాగము
బ్రహ్మేంద్ర భజన
సంపూర్ణము

ఇచ్చట జై శబ్దములు పల్కవలయును
భక్తులు ప్రసాదము దీసికొని వెళ్లవలయును.

ఓమ్

# శ్రీ బ్రహ్మేంద్ర సేవా దర్పణము

## మూడవ భాగము

### బ్రహ్మేంద్ర ప్రభాత సేవ

శ్రీ విరాట్ బ్రహ్మేంద్ర స్వాముల వారికి

శ్రీ మదాది శక్తి గోవిందా భగవతికి

శ్రీ మన్మాతా ఈశ్వరీ భగవతికి

శ్రీ రామ బ్రహ్మ స్వాముల వారికి

శ్రీ అన్నాజీ వరద బ్రహ్మేంద్రో :

శ్రీ ఏకాంబ్ర వరద బ్రహ్మేంద్రో :

శ్రీ చిదంబర వరద బ్రహ్మేంద్రో :

శ్రీ సిద్దయ్య వరద బ్రహ్మేంద్రో :

శ్రీ మద్గోవిందాంబికా రమణ బ్రహ్మేంద్రో :

### ప్రభాత సేవ

### మేలుకొలుపు

39. భూపాల రాగము - ఆట తాళము

మేలుకో శ్రీ వీరబ్రహ్మేంద్ర। గుణసాంద్ర। మేలుకో గరు
చంద్ర। మేలుకో। మేలుకో గోవిందమాంబా మనోహర।
మేరునన్ని భధీరా। మేలుకో ॥తండ్రి॥ మే

భవదీయ దర్శన భాగ్యంబు కామించి। భక్తులు చేరిరి మేలుకో
కవికోటితమ పాద కంజద్వయపు సేవ। గావింపనున్నారు
మేలుకో॥తండ్రి॥ మే

జ్ఞాన శేఖరులు వేడ్కతావక బోధ। వినవచ్చినారయ్య మే

లుకో। ప్రాజ్ఞులు సందేహ। ములబెట్టుకొని వాని। బాయనే తెం
చిరి మేలుకో ॥తంద్రి॥ మే
కారుణ్యమున నవ్యపురదాసవర్యుల। కోరికలిడవలెను మేలుకో
శ్రీరామబ్రహ్మము। నీ ప్రభాతపుసేవ। జేయగనున్నాడు మేలు
కో ॥తంద్రీ॥ మే

## 40. భూపాలరాగం - ఆట తాళం

శ్రీ మద్గో పరిపాల। శిష్య హృదయ లోల। క్షితిసృష్టించిన మూల।
లేరా। హేమ చేల। కరు। ణాల వాలా। మమ్ము। నేల సద్గుణ
జాల। లేరా ॥తంద్రి॥ లే

చుక్క పొడిచియెంతో। నెక్కివచ్చుచునుండె। చక్కని మా
మయ్య లేరా॥ కుక్కుటంబులు దిశల। కొక్కొరొకోయని।
కూయుచునున్నవి లేరా। ॥తంద్రి॥ లే

దీప కళికల యొక్క దీప్తి వెల వెల బారె। తెల్లవార వచ్చె లేరా।
ఆవద్మినీ నాథుడరుదెంచుచున్నాడు। ఆలసింపక నిద్రలేరా।
॥తంద్రి॥ లే

వంది మాగధులెల్ల। వనరుగస్తుతియింప। వచ్చియున్నారయ్య
లేరా। కందర్పశతకోటి సుందర। శ్రీరామ। కవి వేడుచున్నాడు
లేరా। ॥తంద్రీ॥ లే

## 41. భూపాల రాగము - రూపక తాళం

దంత ధావనంబు జేయుము। తంద్రీ। బ్రహ్మేంద్ర దేవ।
తంద్రి। బ్రహ్మేంద్ర దేవ। దయగల మహానుభావ। ॥దం॥

శాస్త్ర సమ్మతమైన పుడక। సంపాదించుక వచ్చియు
శాంత రూప।యుష్మదీయ । సన్నిధిలో నుంచినారము ॥దం॥

బంగారపు కలశముతో। గంగను బట్టుకొని తెచ్చి
భక్త శ్రీరామాఖ్య వినుత। ప్రక్కనని దెబెట్టి నారము ॥దం॥

## స్నానము

### 42. భైరవి రాగము - ఆట తాళము

స్వామి। శ్రీ బ్రహ్మేంద్ర। స్నానమాడగరమ్ము। స్నానమాడగ
రమ్ము। సమ్మోదమున లెమ్ము ॥స్వా॥

పరిమళ తైలములు । భామినులు గైకొని। శిరమున కంటగ
జేరి యున్నారిదే। ॥స్వా॥

హారిద్ర సంకలిత। మైనచూర్ణములతో। దరుణులు నలుగు బె
ట్టగ వచ్చియున్నారు ॥స్వా॥

పన్నీరు బిందెల నిం।పలరపట్టుక వచ్చి। భక్త శ్రీరామబ్ర।హ్మము
వేచియున్నాడు ॥స్వా॥

## వస్త్ర తిలక భూషణ సమర్పణము

### 43. ఆనంద భైరవి - ఆదితాళం

కయిసెయుమా। బ్రహ్మేంద్ర దేవ। కయిసేయుమా।
ప్రియతోడ పీతాం। బరములను దెచ్చి। నయగుణాఢ్య।
నీన। న్నిధినుంచినాము ॥క॥

చందనాక్షతలా। నందమున దెచ్చి। మందహాసవదన। ముందే
యుంచినాము ॥క॥

హారకుండలకే। యూరముల దెచ్చి। శ్రీరామాఖ్య వినుత।
చెంత జేర్చినాము ॥క॥

## వేంచేయుట

### 44. శంకరాభరణము - ఆటతాళం

వేం చేసినాడు। బ్రహ్మేంద్రమూర్తి। వేం చేసినాడు। ముఖ మండ పమునకు ॥వేం॥

వేం చేసినాడు భ। క్తుల వాంఛితము లీయ। కాంచన రత్న సం। ఘటిత పీఠము పైని ॥వేం॥

శ్రీవామాంకమునందు। గోవిందమాంబలర। ఈవలావలసుతులు వింజామరలు విసర ॥వేం॥

ఏకాంబరేశు డిం। పెసగ ఛత్రము బట్ట। ప్రాకటంబుగ సేవ। కులు పరాకుల దెల్ప ॥వేం॥

శ్రితజనంబులు మిగుల। జేయ్। శబ్దముల బల్క। శ్రీరామా ఖ్యుడు ప్రాణా। చారంబులను సల్ప ॥వేం॥

## భక్తాహ్వానము

### 45. ఆనందభైరవి - ఆటతాళం

రావచ్చు రావచ్చును। భక్తాదులంత। రావచ్చు రావచ్చును రావచ్చు రావచ్చు। దేవ దేవుండైన। శ్రీ వీరదేవుని। జెలగిసం దర్శింప ॥రా॥

భక్తులు ప్రార్థింపగ। ధారుణి పైకి॥ పశికూనయై వచ్చియు భక్తుల కష్టముల। బరిహరించిన వీర। బ్రహ్మ భగవానుల। పాదంబులకు మ్రొక్క ॥రా॥

హార కిరీటములతో। రంజనమగు కే। యూర కుండలములతో హాటకాంబరములతో। నలరారు మా స్వామి। వారి సేవించి మ। నో రథముల్ దీర్చి కొన ॥రా॥

శ్రీరామ బ్రహ్మాఖ్యుని। మొర విని సం। రక్షింపగ దలచుకొని శ్రీరామ బ్రహ్మాశ్రమముననివసించిన। జేజెనాయనతీర్థ। శ్రీప్ర సాదముగొన ॥రా॥

## 46. భజనెళ్ళి పోవుచున్నది వలె

జయభేరి వాయించుడీ। బ్రహ్మేంద్రునకు జేయని। జయభేరి వాయించుడి

జయభేరి వాయించుడు । జగతిలోరెండవ । సాటి దైవముమన స్వామికి లేడంచు ॥జ॥

అఖిలాండ కోటి బ్రంహ్మాండ నాయకుడైన। అచ్చమ్మ వంద్యు నకు। నవనీజనలు మెచ్చ ॥జ॥

ఖండాంతర ఖ్యాతి। గనువీర దేవున క।ఖండ విజయ మంచు ధాం ధాం ధమ్మని ॥జ॥

క్షేమంబులిడి భక్త। శ్రీరామ కవి నేలు। జేజేనాయన కెపుడు జేజేజేయ్యని ॥జ॥

సూచన : ఇచట స్వామివారి ముందు అవసర నైవేద్యము బెట్టి ఇందు గల నామ సంకీర్తనపు చివరలోని

వీర దేశికామహాత్మయారగింపవే, శ్రీ విరాడ్బ్రహ్మేంద్ర దేవునకు శ్రీ సంధాయక బ్రహ్మేంద్ర, ఆనందం బ్రహ్మానందం, వీరగురు నను క్షమించి సెవిమ్ము శ్రీ బ్రహ్మేంద్రా! అను కీర్తనల బాడి సరిపుచ్చవలయును.

గద్య

ఇది శ్రీమద్బ్రహ్మేంద్ర భక్తి ప్రచారక, బ్రహ్మేంద్రదత్త

'కవివతంస' బిరుదాంక, శ్రీరామబ్రహ్మనామక

శ్రీరామశర్మ ప్రణీతం బైన

శ్రీ బ్రహ్మేంద్ర సేవా దర్పణములోని

మూడవ భాగము

బ్రహ్మేంద్ర ప్రభాతసేవ

సంపూర్ణము

ఇచ్చటజై శబ్దములు పల్క వలయును,

భక్తులు ప్రసాదము దీసికొని వెళ్ళవలయును



ఓమ్

# శ్రీ బ్రహ్మేంద్ర సేవా దర్పణము

## నాల్గవ భాగము

### బ్రహ్మేంద్ర పూజ

శ్రీ విరాట్ బ్రహ్మేంద్ర స్వాముల వారికి జై
శ్రీ మదాది శక్తి గోవిందా భగవతికి జై
శ్రీ మన్మాతా ఈశ్వరీ భగవతికి జై
శ్రీ రామ బ్రహ్మ స్వాముల వారికి జై
శ్రీ అన్నాజీ వరద బ్రహ్మేంద్రో హరిః
శ్రీ ఏకాంబ్ర వరద బ్రహ్మేంద్రో హరిః
శ్రీ చిదంబర వరద బ్రహ్మేంద్రో హరిః
శ్రీ సిద్దయ్య వరద బ్రహ్మేంద్రో హరిః
శ్రీ మద్గోవిందాంబికా రమణ బ్రహ్మేంద్రో హరిః

సూచన :- బ్రహ్మము గారి వార పూజలు ఆదివారమె చేయవలెను.

### 47. తోడి రాగము - ఆటతాళము

భక్తులారా! రారే

భక్తులారా! రారె। ఖాశిల్లు శ్రీరామ। బ్రహ్మార్పితుండైన।
బ్రహ్మమును బూజింప ॥భ॥

పారిజాతముల శృం।గారోత్పలంబుల। నీరేజాతములగ।న్నేరు
సుమముల గొని ॥భ॥

పొగడ ప్రసూనముల పున్నాగపూల సం। పెంగ మల్లె కుసు
మములు। బ్రీతితో గైకొని ॥భ॥

మందార పుష్పముల। మధ్యాహ్న మల్లెల। మారేడు దళముల
మంచివిగ దీసికొని ॥భ॥

ఆవాహనాదితము

48. రాముని వారమైనాము వలె

శ్రీ వీర బ్రహ్మేంద్రస్వామి। పూజ। సేయగ నారంభించితిమి
భావమలరలోక। భర। యవధరింపుమి। పరిపూర్ణకృపమమ్ము
ప్రభు। కటాక్షింపుమి ॥శ్రీ॥

ఆవాహనంబర్పయామి। సిం। హాసనము సమర్పయామి
అర్ఘ్య పాద్యములుచే। కొనుమర్పయామి। అఘమర్షణస్నాన
ము సమర్పయామి ॥శ్రీ॥

కనక చేలములర్పయామి। కమల। గర్భసూత్రంబర్పయామి
ఘనమైన గంధా। క్షతలర్పయామి। జ్ఞాన ధురీణ। పు। ష్పాణి
పూజయామి ॥శ్రీ

సూచన : ఇందుగల ఉపచారముల జూపించుచురావలయును

షోడశ నామములు

49. మధ్యమావతి - అటతాళము

శ్రీకరాయ నమః ఓమ్। చిన్మయాయనమః ఓమ్
శీతలాయనమః ఓమ్। శ్రితనుతాయనమః ఓమ్
ప్రభువరాయనమః ఓమ్। పావనాయనమః ఓమ్
ప్రవిమలాయనమః ఓమ్। పాలకాయనమః ఓమ్
అవ్యయాయనమః ఓమ్। అక్షరాయనమః ఓమ్
భవ్యాయనమః ఓమ్। భాసురాయగమః ఓమ్

అజప్రియాయనమః ఓమ్। అచలాయనమః ఓమ్
విజయదాయనమః ఓమ్। వీరగురవే నమః ఓమ్

50 రండీ। పుణ్యాత్ములార? వలె

ధూపమిదె సమర్పయామి। బ్రహ్మేంద్ర దేవ। దీపమిదెసమర్ప
యామి। ఓపరాత్పర। మహా నై। వేద్యము సమర్పయామి।
భూపవంద్య। గొనుము తాం। బూలము సమర్పయామి ॥1॥

మంగళము సమర్పయామి। బ్రహ్మేంద్ర దేవ। మంత్రపుష్ప
మర్పయామి। అంగజజితరూపక। సా। ష్టాంగ దండమర్పయా
మి। అధిక భక్తి పునః పూజ। నంద జేతుమవధరింపుమి ॥2॥

సూచన : ఇందుగల ఉపచారములు జూపింపవలయును

పునః పూజ

51. అవధరింపుమీ రామ వలె

వీరగురవరా। గోవిం। దాంబికేశ్వరా।
చేరి పునః పూజనీకిదె। చేయుచున్న వారమయ్య ॥వీ॥
ఛత్రమిదే బట్టినారము। సమ్మోదమున నవధరింపుము ॥వీ॥
పరాకులు :- శ్రీ మదఖిలాండ కోటి బ్రహ్మాండనాయకా! శ్రీమద
ఖిలలోకాశ్చర్య సౌందర్యరూపా!! శ్రీ మదనంత
కళ్యాణ గుణాభిరామా!!!
చామరముల మేము నీకిదె। ప్రేమతోడ వేయుచుంటిమి ॥వీ॥
నృత్యము దర్శింపుమ... నేత్రపర్వముగ... ీవు ॥వీ॥
గీతమి దేపాడుచుంటిమి। ప్రీతితో నాలింపు మయ్య ॥వీ॥
పరాకులు : శ్రీ మదఖండ పరిపూర్ణ సచ్చిదానందా ద్వైతజ్యోతి

స్వరూపా! శ్రీ మదాదిశక్తి గోవిందా భగవతి
హృదయ సరసీరుహ భాస్కరా!! శ్రీమత్కిరీట కుండల
కేయూర కంకణాంగుళీయకాది సర్వా భరణ శోభాయమానా!

వాద్యములను జేయుచుంటిమి। హృద్యంబుగ వినగదయ్యా ॥వీ॥
ఆందోళికము దెచ్చియుంటిమి। కారోహింపుమయ్యా నీవు ॥వీ॥
వారణమును దెచ్చియున్న। వారము లేలెండుకూర్చొన ॥వీ॥

పరాకులు :- శ్రీ మదఖిల బృందారక వందనీయ సుంచర చరణ
శోణరవిందా! శ్రీమద్ఘనసార నీహారమరాళ
శారదేందు సదృశయశోవిస్తారా! శ్రీ మద్రామ బ్ర
హ్మాశ్రమస్థ సువర్ణ రత్నస్థగిత సింహాసనాసీనా!

అశ్వమిదె యలంకరించితి। మధివసింపరమ్ము వేగమే ॥వీ॥
అఖిల రాజ దేవోపచారము। లధిక భక్తి జేసినారము ॥వీ॥
భక్త శ్రీరామాఖ్య కవిని। పరమశ్రద్ధ గాంచుమయ్యా ॥వీ॥

సూచన : ఇచ్చట నిందుగల నామ సంకీర్తనపు చివరలోని
వీర గురూ। నను క్షమించి, సెలవిమ్ము శ్రీ బ్రహ్మేంద్రా। అను
కీర్తనల బాడి సరిపుచ్చవలయును.

గద్య

ఇది శ్రీమద్బ్రహ్మేంద్ర భక్తి ప్రచారక, బ్రహ్మేంద్రదత్త
'కవివతంస' బిరుదాంక, శ్రీరామ బ్రహ్మానామక
శ్రీరామశర్మ ప్రణీతంబైన
శ్రీబ్రహ్మేంద్ర సేవాదర్పణములోని
నాల్గవ భాగము
బ్రహ్మేంద్ర పూజ సంపూర్ణము

ఓమ్

# శ్రీ బ్రహ్మేంద్ర సేవా దర్పణము

ఐదవ భాగము

## బ్రహ్మేంద్ర సహస్రనామ పూజ

శ్రీ విరాట్ బ్రహ్మేంద్ర స్వాముల వారికి జై

శ్రీ మదాది శక్తి గోవిందా భగవతికి జై

శ్రీ మన్మాతా ఈశ్వరీ భగవతికి జై

శ్రీ రామ బ్రహ్మ స్వాముల వారికి జై

శ్రీ అన్నాజీ వరద బ్రహ్మేంద్రో హారిః

శ్రీ ఏకాంబర వరద బ్రహ్మేంద్రో హారిః

శ్రీ చిదంబర వరద బ్రహ్మేంద్రో హారిః

శ్రీ సిద్దయ్య వరద బ్రహ్మేంద్రో హారిః

శ్రీ మద్గోవిందాంబికా రమణ బ్రహ్మేంద్రో హారిః

సూచన :- ఈ పూజ వారమునకొక పర్యాయము చేయువారు ప్రత్యాదివారము చేయవలయును, ఆదివారము నాడు నా పూజ జేయవలయునని ఆనందభైరవునితో బ్రహ్మముగారే చెప్పిరి. చూడుడు, చా.సు.వీర.చరి. 17 పుట భగవదాజ్ఞ నిట్లుండుట వలన వేరు వారము పూజజేసి వ్యతిరేక ఫలము నొంద కుందురు గాక

ముందు స్వామిని శుభ్రపచిర దీపారాధన గావించి సంకల్పమున కారంభింపవలయును.

### సంకల్పము

ఓం స్వయం భవాయస్వాహా జగత్స్రష్టాయస్వాహా విరాట్పురుషాయ స్వాహా ఆనంతాయనమః కాలజ్ఞాయనమః దేవ దేవాయనమః

పరమాత్మనే నమః నిర్వికల్పాయనమః చిదానందాయనమః దయామయాయనమః కామరూపాయ నమః భూత వాసాయ నమః గుణభద్రాయనమః విశ్వదేశికాయనమః నిర్ద్వంద్వాయనమః మంత్రగమ్యాయనమః యజ్ఞప్రియాయనమః పరమహంసాయ నమః సర్వతోముఖాయనమః పరిపూర్ణాయనమః వాంఛిత ప్రదాయ నమః ధర్మస్థాపకాయ నమః భగవతే నమః శ్రీ వీరదేవాయనమః

ఉత్తిష్టంతుభూత పిశాచాః ఏతే భూమి భారకాః

ఏతేషామవిరోధేన బ్రహ్మకర్మ సమార భేః

ప్రాణాయామము

ఓం భూః ఓం భువః ఓగ్ సువః ఓం మహః ఓంజనః ఓం తపః ఓగ్ సత్యం ఓం తత్స వితుర్వ రేణ్యం విశ్వకర్మ దేవస్యధీమహిధియో యోనః ప్రచోదయాత్ ఓమా పోజ్యో తిరసోమృతం బ్రహ్మ భూర్భువస్సువరోమ్

మమోపాత్త దురితక్షయ ద్వారాశ్రీ విశ్వకర్మ పరమేశ్వరము ద్దిశ్య శ్రీ విశ్వకర్మ పరమేశ్వర ప్రీత్యర్థం శ్రీ విరాట్పురుషాజ్ఞయా ప్రవర్త మానస్య ఆద్యబ్రహ్మణః ద్వితీయ ప్రహరార్థే, శ్వేత వరాహకల్పే, వైవస్వత మన్వంతరే, కలియుగే, ప్రథమపాదే జంబుద్వీపే భరతవర్షే భరత ఖండే మేరోర్దక్షిణ దిగ్భాగే శ్రీ శైలస్య.... ప్రదేశే.... మధ్య దేశే... గృహే సమస్త దేవతా బ్రహ్మేంద్రసన్నిధౌ అస్మిన్వర్తమానేనవ్యావహారిక చాంద్రమానేన సంవత్సరే...ఆయనే...ఋతౌ..మాసే...పక్షే...తిధౌ...వాసరే శుభనక్షత్రే శభయోగ శుభకరణే ఏవంగుణ విశేషణవిశిష్టాయాం శుభతిధౌ

శ్రీమతః...గోత్రస్య...నామధేయస్య మమసకుటుంబస్యక్షేమ స్థైర్య విజయ అభయ ఆయురారోగ్య ఐశ్వర్యాభివృధ్యర్థం ధర్మార్థకామమోక్ష

చతుర్విధ ఫలపురుషార్థ సిధ్యర్థం శ్రీమద్గోవిందా భగవతీసమేత శ్రీబ్రహ్మేంద్రస్వామి దేవతాముదిశ్య శ్రీమద్గోవిందాభగవతీ సమేత శ్రీబ్రహ్మేంద్రస్వామి దేవతా ప్రీత్యర్థంయావచ్ఛక్తిధ్యానావాహనాది షోడశోపచార పూజాంకరిష్యే.

కలశోదకేనపూజాద్రవ్యాణి సంప్రోక్ష్య, దేవమాత్మానంచసంప్రోక్ష్య

(స్వామిపైనొకపుష్పముంచితాకుచు నీక్రిందిప్రాణప్రతిష్ఠమంత్రము చెప్పవలయును)

ఓం అసునీతే పునరస్మాసు చక్షః పునః ప్రాణమిహనోధేహిభోగం, జోక్ప శ్యేమసూర్యముచ్చరంతమనుమతే మృడయాన స్వస్తి, అమృతం వైప్రాణా అమృతమాపః ప్రాణానేవయథాస్థానముపహ్వాయతే.

స్థిరోభవ, వరదోభవ, సుప్రసన్నోభవ, మమప్రసన్నోభవ స్థిరాసనంకురు॥

## ధ్యానము

శ్లో॥ శ్రీవిరాడ్వీరదేవాయ। దేవతానీకపాలినే,
గోవిందా ప్రాణనాథాయ। భావిజ్ఞాయనమోనమః
శ్రీమద్గోవిందా భగవతీసమేత బ్రహ్మేంద్రస్వామినేనమః
ధ్యానం సమర్పయామి

## ఆవాహనము

శ్లో॥ సర్వ ప్రపంచ బీజాయ। సర్వాభీష్టప్రదాయినే
సర్వలోకైకనాథాయ। సర్వ జ్ఞాయనమో నమః
శ్రీ మద్గోవిందా భగవతీ సమేత బ్రహ్మేంద్రస్వామినే నమః
ఆవాహనం సమర్పయామి

